పదేండ్లపాటు సభ్యులై జాతీయ ప్రబోధము గావించినారు. రాట్నము, గాంధి, అస్పృశ్యత, పంజాబువధలు, భారతమాత ఇత్యాదిశీర్షికలతో వీరు రచించిన పద్యములు తెలుఁగు చదువరులకు సుపరిచితములు. వీరి యాదర్శములకుఁ దగినటులుగా మహాత్ముని యాత్మకథ మధురమైన కావ్యముగా సంతరించినారు. ఈరచన లిటులు సాగించుచునే దుగ్గిరాల, బాపట్ల, నిడుబ్రోలు, అప్పికట్ల హైస్కూళ్లలో నాంధ్రోపాధ్యాయ పదవి నిర్వహించి శిష్యుల నెందఱనో దిద్దినారు. ప్రకృతము వీ రుపాధ్యాయ పదవియందే యున్నారు.

ఈయభినవ తిక్కననుగన్న తలిదండ్రులు ధన్యులు. చౌదరిగారితండ్రి నారయ్య ధర్మజ్యోతి. ఆయన శీలసంపద శాశ్వతమైన కృతిగా సంతరించి, యీపుత్రుఁడు మనకిచ్చెను. జనకునిపై తనయునకుఁ గల భక్తిగౌరవములకేకాక, నీతి నిష్ఠావిశేషమునకు, రసభావ సౌష్ఠవములకుఁగూడ 'ధర్మజ్యోతి' ఆకరకాణమైన కావ్యము. చౌదరిగారు తండ్రినిగూర్చి యిటులు వ్రాయుచున్నారు :

చదువకయున్న నేమి బుధసత్తము లుబ్బఁగ నర్థభావసం
పద వికసింప భాగవత భారతముల్ వివరించు; హృద్యముల్
తదమలకావ్యపద్యములు ధారణ కగ్గముచేసి వేనవేల్
చదువునతండు; తచ్ఛ్రవణసాహితి దుశ్శక మెట్టివారికిన్.

మక్కువమై కొండికనాఁ
డక్కఱగల యద్దు! లేనియప్పుడు నోఱపో
చక్కట్ల దండ లాతఁడు
పెక్కులు మన్మాదుల హృదయపీఠికఁ జూట్టెన్.

సౌజన్యమూర్తియగు "తుమ్మల" కవికి ౧౯౪౯ లో, కనకాభిషేక గౌరవము జరిగిన సందర్భమున శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి యధ్యక్షుఁడుగా విప్పిన హృదయ మిట్లున్నది.

